Reg No M 757

శ్రీ

# అభినవసరస్వతి.

యను నొక మాసపత్రిక.

అష్టావధాని, జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

బ్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాఁడుతాలూకా, జానపాడు.

సంపు 3.] 1911 సం॥ మే నెల. [సంచిక 5.

విషయములు.



చందా నిర్ణయము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25-0-0 | సహాయులకు | రు 5-0-0 |
| పోషకులకు | రు 10-0-0 | చందాదారులకు | రు 2-0-0 |

భారతీవిలాస ముద్రాక్షరశాల, నర్సారావుపేట.

Printed at the Bharathi Vilasa Press,
Narasarowpet. And published at Janapadu
by the Editor Astavadhani
Janapati Pattabhirama Sastry.
1911

ఈసంవత్సరముచందా యిచ్చిన—

## స హా యు లు

1 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

2 పిరాట్లసీతాకాంతంగారు, చింతపల్లి.

3 పిరాట్ల సత్యనారాయణగారు, చింతపల్లి.

4 కొప్పరాజు గురుచంద్రశేఖరరావుగారు, ఫారెస్టుగార్డు, నేళ్లవాగు

5 కంచర్లలక్ష్మయ్యగారు, ఫారెస్టుగార్డు పాపయ్యపాలెం.

6 వుప్పలపాటి వెంకటసుబ్బయ్యగారు, కరణం వుప్పలపాడు

ఇవ్వవలసినవారు—

7 సూరిదేవర సుబ్బానాయుడుగారు, తుమ్మపూడి.

8 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

9 తడిసిన రామధర్మారెడ్డి దేశముఖుగారు కొమ్మెవ్వడ.

10 కాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట.

11 రాజశేఖరుని లక్ష్మీనారాయణగారు, కరణం, చిట్యాల

12 కోలాపిచ్చిరెడ్డిగారు, గ్రామమునసబ్, దాచేపల్లి

13 గోపాలుని రామలింగయ్యగారు, ముప్పాళ్ల.

14 వెలుగూరి పిచ్చయ్యగారు, పెదకొదమగుండ్ల

15 ఘుడియారం వెంకట శివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి

16 నూతక్కి నరసింహ నాయుడుగారు విలేజిమునసబ్, మందడం

17 బూదరాజు వెంకటసుబ్బయ్యగారు, కరణం, స్వర్ణ.

18 ఏలేశ్వరం వెంకటసుబ్బారావుగారు, వకీలు, సిద్దిపేట

19 కలవలపల్లిరంగయ్యశాస్త్రిగారు, భాష్య-రాచార్యులు, యేలూరు

20 మంచిళ్ళ నారాయణరావుగారు, కంభంపాడు.

21 గుజ్జాల వెంకటరెడ్డి దేశముఖుగారు, గుండవరం.

22 గంభీరరావుదేశాయిగారు, లింగన్నపేట.

23 సైయద్ ఖాసింసాహెబుగారు ఫారెస్టుగార్డు, చింతపల్లి

24 గోరంట్ల పున్నయ్యగారు, వుప్పలపాడు

25 మెందకు శేషారావుదేశముఖుగారు, నల్లబల్లి.

26 చింతలచెర్వు గోవిందరెడ్డిగారు, గ్రామమునసబ్, చంద్రాజుపాలెం

శ్రీమత్.

# అభినవసరస్వతి.

ఇది మాసమున కొకసారి ప్రచురింపఁబడును.

## గ్రంథస్వీకారము

తిరుపతివెంకటీయములగు శ్రవణానందమును భారతనాటక పంచకమును శనిగ్రహమును నానారాజసందర్శనమును శతావధాన సారమును పాణిగృహీతయును దేవీభాగవతస్కంధ చతుష్టయమును బందరుశతావధానమును మాంకాళ్యాస్థానమలంకరించి యపారానంద ముఁగలిగించినవి బహుమూల్యసాధ్యములగు నిన్నిగ్రంథములదయ సేసిన బ్రహ్మశ్రీ॥ శతావధానులగు చెళ్లపిళ్ళవెంకటశాస్త్రులవారి యౌదార్యము వేనోళ్ళశ్లాఘ్యము శ్రవణానందము వీరియాంధ్రకవన ములోఁ బ్రథమమునరచింపఁబడినదఁట వీరీగ్రంథమునురచించుట లో బుద్ధినెంతవినియోగపఱచియుండిరో యంతకినుమిక్కిలిగ దీనికే తన్నామనిర్దేశముఁజేయుపట్ల వినియోగించియుందురని నాయాశయ ము అట్లుకానిచో విన్నమాత్రమున బండితులకును పామరులకును బాలురకును స్త్రీలకును వీరువారననేల? యందఱికిని సమానానందము గలిగించునదియై యింతసార్థకనామముగా నేరదు. శ్లో॥ సర్వ్యయంత్య సతోదోషాన్ ఛాదయంతిసతోగుణాన్ అసూయాయాః ప్రభావేనప్రా జ్ఞాఅపిమహాత్మను॥ అనున్యాయమున నవనాగరికులు కొందఱసూ యాపరులై యిదియంతనీతిదాయకముగానుండలేదని యభిప్రాయ పడినఁబడుదురుగాక, ఇంతమాత్రమున నీగ్రంథమునకుఁగాని గ్రంథ కర్తలకుఁగాని లోపమురాఁబోదు నిరంకుశమగు నసూయాప్రభావముం గాంచి యోర్చియుండుటయెంతకష్టము? అట్టిపోఁబడుగురికిని నచ్చి నను నచ్చకున్నను మొగముఁజిట్లించుకొనుటకొందఱికిలక్షణమైయుం

డును. ఇతరులప్రభఁజూచి యేమియుననక యుండిన లోకులుతమను దెలివితక్కువవారనియనుకొనిపోదురని వారియాశయము మధ్యమధ్య సందర్భానుసారముగ ననేకములుండినను రాజామంత్రిప్రగడభుజంగ రావుగారి వారకాంతయందును వీరిశ్రవణానందమందును బాణిగృహీతయందును "వారకాంతాసాంగత్యముకూడదని,, పరిపోష్టు. ఎద్దియొకథంబొందుపఱచి పణ్యాంగనాలోలురపాట్లు వర్ణిపఁబడియున్నయవి అట్లయినఁగదా! ముందాకార్యమునఁబ్రవర్తింపఁ బోవువారికి భయముకలుగును. అంగనామణులకచకుచవర్ణనాదుల కవకాశమీక యంతయు నీతిమయముగానేయుండవలెనన్న లోకమున నిన్ని గ్రంథములే రచింపఁబడక పోవలసియుండె. ఉన్న నీతులన్నియు నొక గ్రంథముననే చెప్పవచ్చును. ఓ యలంకారశాస్త్రమా! ఇప్పటికేమి చొచ్చితివొ చొచ్చితివిచాలుఁగాని యికమీఁద మాత్రము తెలుఁగుబాసలోనికడుగిడకు. ఈనీయత్కించిదావిర్భావమే నవనాగరికులు భరింపలేక యున్నవారు కావునఁ దత్సంస్కృతమున నేపడియుండు నిన్ను జూచియానందపడువారే పదుమురు శ్రవణానందమందలి కొన్నిముఖ్యములగునీతులిందుఁ జూపఁబడుచున్నవి.

గీ॥ నిదురఁబోఁగొట్టుఁగ్రమముగా నెత్తికెక్కుఁ,
గలుషతఘటించుఁగుండయుఁగల్లయుఁదన
చేతికొనఁ గూర్చు నదిగానఁ జెప్పనగు నొ
వేశ్యకును నస్యమునకును భేద మిలను.

సీ॥ మాయమాటలకు నమ్మక మైనవ్యాఖ్యాత
తుల లేనిపచ్చిబూతులకు బుంగ
యనుచితవ్యాపారమునకుఁ బెట్టినపేరు
స్తుతిపారవాక్యసంతతికి నంది

పరమనోభిప్రాయహారణమ్ము నకు సద్ద
మన్వృతవాక్యముల కిమ్మైనకొంప
తనయానువిరచితా వినయమ్ములకు ఛత్ర
మఖిలదోషములకు నాలయంబు

తే॥గీ॥ బెట్టుసరిమాటలకు నెల్లఁ బుట్టినిల్లు.
నిఖిలధనసంతతులకు శనిగ్రహంబు
వెనుక ముందును దెలియని వెట్టివెట్టి,
విటులపాలింటియమదూత వేశ్యమాత.

ఉ॥ జారసఖిన్ ధనాంగనను జానినిఁ జోరునిఁద్రాగుఁబోతు నె
వ్వారునుగీర్తి కానపడువారలు కొంపకుఁ జేర్పరాదు త
ద్ద్వారముఁ గార్యముండినను దాముఁద్రొక్కఁగరాదునిక్కమీ
తీరు పెఱుంగకున్నఁగొని తేనలెనే యపకీర్తి యేరికిన్.

సీ॥ కొండమాచార్యపుత్రుండను రామామణి నెనసి
నిర్భాగ్యుఁడై చనఁగ లేదొ
నీలకంఠావధానికుమారుఁడలచంద్రముఖిఁ గూడి
మాన్యమమ్ముకొనలేదొ
హనుమంతరావు చేకొనిదత్తుఁడుసుందరినిఁ గూడి
కొంపమ్ముకొనఁగ లేదొ
అల్లకృష్ణయమంత్రి యనుజుండుమణిమాలతోఁ గూడి
ముష్టి యెత్తుకొనలేదొ

తే॥గీ॥ వీరలొక లెక్కయే జమీందారులెంద,
ఱెందఱప్పులపాలగు టెఱుఁగఁబడను
అమరఁగాక హిరణ్యశృంగములుతనకు,
వెలవెలఁదిపొందుపలుకష్టములకువిందు.

క॥ ధనకాంతామోహమ్ములు,జనులకుస్వాభావికములుజగముననెవఁడీ
ధనకాంతామోహమ్ముల,గనకుండును వానిశివునిగా నెన్నదగున్

సీ॥ తల్లిదండ్రులువిన్నఁదప్పుగాగణియింతు
రత్తమామలువిన్న నాదరింప
రూరిపెద్దలువిన్న గారవింపరుమాట వినఁ
దగువారునువినరు తనకుఁ
బ్రాణమిత్రులుగూడఁ బరిభవింపఁగఁజూతు
రాలుచుల్కనఁజేసి గాళుఁజేయుఁ
దననవుకరు గూడఁదన్ను సేవింపఁ జేయు
నన్న నన్యులమాట లెన్ననేల?

తే॥గీ॥ ధనము చెడుఁగీర్తి చెడు దేహమునకు లేని
పోనిదురవస్థ గల్గును గానవిత్త
కాంతలనుగూడువారికొక్క యెడనైన
నగుపడదుసౌఖ్యము, విచారమ కుగవలెనె?

తే॥గీ॥ వన్నెచిన్నెలు గలగొల్లకన్నెముంత
సర్వజనులును దొంగిరిక్కబజారుసంత
అందఱును నేగ నేమించినట్టిపుంత
వంతలకు వింతదొంతర పంచకాంత

మ॥ మును లీలాశుకకాళిదాసకవిరాణ్ముఖ్యుల్ ధవస్త్రీలతోఁ
డను గ్రీడింపరౌదానవారలప్రతిష్టల్ వ్రాయ నేఁయించునీ
వనఁదప్పేఁజుమీనక్క యెడదివిజాభ్యసూలయుం బేడ!నో
మనమా!నద్దఁకనాయనమాటవినుమా!మర్యాదఁగా పాడుమా.

మ॥ జననం బందినదాసికి ఫలము సచ్చారిత్రుఁడై సర్వస
జ్జనులుం దన్నునుతింప ధర్మపరుఁడై సాధుస్వర్బ్రహ్మముం
గననూహించుటకాక, కామియయి భోగస్త్రీల భోగింపుటా?
మనమా!వద్దఁక నాదుమాటవినుమా! మర్యాదఁ గా పాడుమా.

శశి—అవి యెట్లుకుదురునో! యివియు నటులే కుదురును, ద్వైతులు జీవేశ్వరు లొక్కరనుట కొప్పుకొందురా యేమి పాపము ఇట్టివీరికి మధుసూదనాచార్యులు పరమేశ్వర్యుపాసకుఁ డని చెప్పినయెడ శంక కవకాశ మెట్లు వచ్చినదో! దానికేమి వేపకాయయెందుకుఁ గాఁగూడదు,! హారమం దెందుకుధరింపఁగూడదు!

ప్రకా—పద్యము చూచితివా! మొదట నది దొరకినచోటు గోలకొండగను లనియింగ్లీషున వ్రాయఁ బడి యున్నదికదా! గోలకొండ సముద్రతీరమున నే యున్నదా! (స్మృతినభినయించి) ఆవును! అచట హుసేనుసాగరమున్నది మఱచి పోయినాను సరే ఇఁక నావజ్రము మొదట వేపకాయంతయుండుటయుఁ బిదప దానిముక్కలలో నొకదానిని శ్రీయుష్మద్ధనక్రనన్నగారుఁ ధరించుటయుఁ దేలవలెనుధరించుట కేమియెక్కడనోయుగుఁగాక, శ్రీవారు ధరించునప్పటి కది కందిగింజంత యుండునో! పెసరగింజంతయుండునో! చెప్ప లేదు. ఔరా! కోహినూరువజ్రమునకువచ్చిన దుగవస్థ!, ఇది వీరు మున్ను నొడివిన చెఱుకువంటికవమే కాఁ బోలును.

శశి— నీవు కష్టార్థమునుజేసి కొన్నావు. నింబ మం టేనిమ్మ కాయ, ఆవజ్రము కోడి గ్రుడ్డంత యుండు నని కొందఱు వ్రాసి యున్నారు. వీరు దానిం బట్టి చెప్పి యున్నారు. నింబశబ్దమునుండియే నిమ్మ పుట్టిన దని కవులయాశయము అంబ నుండి యమ్మ పుట్టలేదా! లేనిపోని యాక్షేపణలు మాని వినుము.

విదూ—(పటాక్షేపమునఁ బ్రవేసించి) హీ, హీ, హీ. హీ ఇదియేనా! మీ పాండిత్యము వార్తాపత్రికలకు భాషాజ్ఞాన మింతకన్న నుండదు నిమ్మఅనునది తద్భవము కాదు దేశ్యము. తెలిసినదా! వారు చెప్పినది సరిగానే యున్నది. కావలసినచో నేను ప్రయోగము తీయఁ గలను. వినుండు.

సీ॥ కోహినూర్వజ్రంబు గురివెందపూసంత మేరుపర్వతము మామిడ్డియంత
తోయధి పారుగింటితూము కాలువయంత కంజజాండం బావగింజయంత
చంద్రబింబంబువిశ్వస్తాశినం బంత రవిబింబ మొకసాన రాయియంత
ఆకాశమంతయు నా కాలిముల్లంత లోకమ్ము లెల్ల మాలోగిలంత

తే॥గీ॥ ఏన్గు దోమంత వారుధం బీఁగయంత

యెద్దు పేనంత యీరంత పెద్దమేకము
ఆదిశేషుండు బల్లితోకంత యాది
కూర్మరాజంబు నాకొనఁగోటియంత॥

విన్నారా! ఇంకను వారు మంచికవీశ్వరులు గనుక కోపకాయంత అని గ్రైనఁ జెప్పినారు ఇది తుద కిప్పుడు శకలశకలములై యావగింజకన్నను దక్కువ స్థితిలో నున్నదని నేను ఋజువు చేయగలను అంతర్నాటక మని చెప్పి మీ ర ష్టావధాన విమర్శనము మొదలు పెట్టి మిమ్ము నీశతావధానవిమర్శనములోని కెవరురమ్మన్నారు వలసినచో( దక్కిన ద్వాద్వైపాయనాచార్యులు గారే వ్రాసి కొంటారు పదండి ఇందులో నిదే తీసి యేదేని భరతవాక్యముగాఁ జదువండి ఆపుస్తక మీలా గివ్వండి నేనే వెదకి యిస్తాము (పుచ్చుకొని) ఇదుగో ఈపద్యము చదువండి అనుకూలముగానే యున్నది.

శశి—(20 వ పుటలో)

91 శ్రీరామపట్టాభిషేకము.

తే॥గీ॥ భరతుఁ డొకవంక ఛత్రముఁ బట్టుచుండ
లక్ష్మణుఁడు చెంత నిల్వ సలక్షణముగ
సీత యంకంబుపైఁ గమఁ జెన్ను మిగుల
రామపట్టాభిషేకంబు రమ్య మయ్యె॥

విదూ—ప్రకాశికా! నీవొకటి చదువుము.

ప్రకా—శ్రీవారికిఁ బుత్రుఁడుద యింప దేవునిఁ బ్రార్థించుట.

కం॥ "వందనము సేయుదముహరి
కందజమును బీఠికాపురాధీశునకుఁ
నందనుఁ డొకఁ డుదయించ న
మందానంద మ్మొకండు మన కుదయింపన్॥,"

21 వ పుట.

విదూ.—పద్య మనుకూలముగానే యున్నది. అయినను నిది యించుక మార్చి యాశీ ర్వాదింతముగాక.

కం॥ నందనులును నందినులు న । మందానందమ్ము గూర్ప మహిపతి సామ్రా జ్యేందిరకుఁ బ్రియుఁడై నిష్పందయశము సూర్యరాయజనమణి గాంచున్

(అందఱును నిష్క్రమింతురు)

అంతర్నాటకము సమాప్తము.

ఇఁకఁ బ్రకృత మనుసరింపుదము తుట్టతుదను జూపినపద్యములు తప్ప నీరెండు శతావధానములును జూచిన వీవైనపద్యములున్నట్లు తోఁచదు.

65 కలికాలము.

కం॥ "సుతుఁడుఁ దండ్రిని జెనకుఁ
పతియుఁ దెగ నాడు మగని సత్సభలందున్
మతి లేనివాడు తమసం
గతిఁ బ్రకటించఁగ నెంతు కలికాలమునన్॥

(17-వ పుట.)

పైపద్యము ధారాశుద్ధి గల్గి యున్నది కాని వ్యాప్తిమాత్రము కుదురుట దుర్ఘటము సత్సభలలోనే కదా! యెవరేని దమసంగతిని బ్రకటించుకొనవలెను అట్టివారిని మతి లేనివా రని దూషింప మొదలిడి రెందులకో! కాకవ్యాసము వలె నిది కూడఁ దమమీఁదికి వచ్చుచున్నదే! పైపెచ్చు తుట్టతుదిసంగతి కలికాలలక్షణ మనుటకుఁ దగదు. కావున "మతి లేనిశిష్యులు కృతఘ్నులగుచు వెనుదీయ రకట! కలికాలమునన్" అని సవరించుకొనుట యుక్తము ఇందులకు "నశిష్యగురుసంస్థితిః అనివిష్ణుపురాణవచన మాధారము కాఁగలదు ఇఁక నిందు వీరు వృత్తములు చెప్పక తప్పినది కా దనువిషయ ముదాహరింపఁ బడుఁగాక

95 తెల్వి లేనినీచుని కైశ్వర్యము గల్గిన వాని నడవడి యెట్లుండును.

కలిరాజవిరాజితము.

ఘనులను నీచులఁగాఁ గను నీచులఁ గాంచుఁగడున్
గడు గణ్యులుగన్,
మనమునఁ గోపము మానుగఁ బెంచును మానులస
ద్గుణమైత్రిని వి,
జ్జనులను దూఱును జాలఁగఁ జేయును సజ్జనసంతతి
సంతతమున్,
ఘను సిరి నీచుని జేరఁగ నరించిన విశ్వమునన్
బృథివీరమునన్.

ఇందుఁ గలపద్యములన్నిటిలోఁ బ్రశ్నమును నుత్తరమును వృత్తమును గూడఁ జక్కఁగాఁ గుదిరినదిదియే సిరికి "నీచాన్నీచతరోపసర్పణ మహో మేతత్త్రికాచార్యకం, అని మురారిమహాకవి చెప్పినట్లు నీచోపసర్పణము సహజగుణము అట్టిచో నతనికి నెవరు ఘనులో! యెవరు నీచులో! తెలియదు పైఁగా సర్వమును దెలిసినట్లు నటించును జ్ఞానులను దూఱును నను నంశము లన్నియు స్వభావోక్తులు ఇందు విజ్జనులు అన్నది గూఢపదముగా నున్నది కాని యూహించుటచే నదియును గౌరవాపాదకమే యని మాయభిప్రాయము, నన్నయభట్టునతనినుబట్టి యొకవిశ్రమముమాత్ర మున్నన్ జాలు నని కనుపట్టుచుండినను నవధానములలో నీ రీతోత్రివఁగూడఁ ద్రొక్కు నంగుల కెంతయు సంతసింపవలసి యున్నది. ఇట్టి దింకనొకటి మాపువ మన్న నిందుఁ గడు మృగ్యము, ఇఁక 25 వ పుటలోని రెండవపీఠిక విమర్శింపఁబడును. కవితావిమర్శనమును గూర్చినఖండనమునఁ "పీఠిక వ్రాసినపిదపఁగాని విమర్శనయుక్తము గా దని వ్రాసినవ్రాఁత గ్రంథకర్తలు జ్ఞప్తికిఁ దెచ్చుకొందురు గాక. ప్రతిమనుజుఁడును గవిత్వమేనిఁ జెప్పునుగాని పీఠిక వ్రాయనేరఁడు. ఇం దున్నయంశములలో 100 టికి 99 ది యనవసరమును నప్రస్తుతప్రశంసలు నై యున్నవి. ఈయప్రస్తుతప్రశంస యుండఁగా వీరు మరల నప్రస్తుతప్రశంస వ్రాసినట్లు పత్రికలలోఁ జదివి యీపునరుక్తి యెందులకని యోజించుచుంటిని. ప్రకృత పీఠికయందు శ్రీద్వివేదులరామకృష్ణకవిగారు తల్లిదండ్రులు

పూజోచితోపకరణములు గలవాఁడై యతితీవ్రముగఁ జలించెడి యంతఃకరణచే లేవఁబోయినవాఁడయ్యు సేవార్థమరుదెంచి సమీపమున వసించెడి రాజలోకముచేఁ బట్టభద్రునకిది పనికిరాదని బోధించి నిరోధింపఁబడిన వానివలె నున్నవాఁడు. (చక్కఁగాఁజూపించి)

చం॥ ఇతఁ డుదయాద్రిశృంగమున నెక్కి చెలంగెడి సూర్యుఁడట్టు లు
న్నతమగుభద్రపీఠిపయినం గడుమీరుచునున్నవాఁడు తా
శ్రితభృదమాత్యవర్గములఁ జెంతకుఁ జేరఁగనీ కదల్చుచుం
గృతకలధౌత వేత్రుఁడగుకృష్ణుఁడు ముందటనిల్వ నమ్రుఁడై॥ 14

కావున సమీపమునకుఁ బోవుదము.

కృ—— మహారాజా! ఈదేవకీవసుదేవులు మీకునమస్కరించుచున్నవారు.

ఉగ్రి—ఆ! ఏమీ దేవకీవసుదేవులా? దైవవశమున జీవలోకముం బ్రవేశించితి. (ఇట్లువేగముగా సమీపించి కౌఁగలించికొని కన్నీళ్ళతో) అయ్యయో!

సీ॥ తనివిదీఱయెడులాగుకనులఁజూతునటన్నఁ గన్నీరుకాల్వలై కాఱసాగ
బాగుగావాకెత్తిభాషింతమనుకొన్న గద్గదస్వరము ముందు ఘటనపడియెఁ
గరయుగంబునసాచికౌఁగిలింతమటన్నఁ బాహుకంపముగూడఁ దోడుపడియె
మనసుదీఱఁగ లెస్సమననసేయుదమన్న శోకభారమువీడి పోకపోయెఁ
కష్టములుదీఱె నెటులొ బహుకాలమునకుఁ
గలిసినటువంటిమిమునొక్కగడియయేని
సరిగసంభావనము సేయఁజాలనైతి
నేమిచేయుదు హా! యింక నెందుఁజొత్తు॥ 15

దేవకి—దైవాధీనమగు సాధారణ విషయమునఁగూడ నాత్మను విషాదపెట్టందగదు. (ఇట్లన్యోన్యము కన్నీళ్లుతుడిచికొందురు.)

ఉగ్రి—ఇక్కడఁగూర్చుండుము (అని తనయర్ధాసనమునకు లాగును.)

దేవకి—మాబోఁటు లిట్టియాసనమునఁ గూర్చుండరాదు.

ఉగ్ర—(నవ్వి) ఓహో! ఇటువంటికార్యమున నియోగింపఁబడిన రామకృష్ణులచే బంధుజనాదరమునకు బాహ్యుఁడగాఁ జేయఁబడితిని. (ఇట్లు స్వసనిూసస్థమగునాసనమునఁ గూర్చుండఁ బెట్టును.)

దేవకి—మహారాజా! ఇప్పటికిని మీరు బంధుత్వము ననుసరించి యుండెడిచో రామకృష్ణులు కృతాపరాధులు కొంటెపిల్లలే యగుదురుగాక. ఐనను భక్తులనియో యనురక్తులనియో యనుచరులనియో బంధువులనియో మీచే శత్రువులవలని భయములేకుండఁ గాపాడఁబడవలె.

ఉగ్ర—కాపాడఁబడవలెనని యేలయనియెదవు.

సీ॥ త్రిభువనగురుఁడనాఁ దేజరిల్లుచుఁ జాల సకలప్రపంచంబు సాకునెవఁడు
సర్వభూతములందు సంపూర్ణుఁడై యుండి యెల్లశక్తులుగల్గి యెసఁగునెవఁడు
సాక్షాత్పరానందసందోహకందమై లలి సర్వసాక్షిగాఁ బెలఁగునెవఁడు
పరమపూరుషుఁడయ్యు ధరణీతలంబున లీలార్భకుండౌచు గ్రాలునెవఁడు
క్లేశకోశాద్యపేతుఁడై లీల జగము । లాత్మకుక్షిని ధరియించియలరునెవఁడు
అట్టివాచామగోచరుండైనసునుని । శత్రువులనుండి రక్షింప శక్తుఁ డెవఁడు॥ 16

ఇదియునుంగాక.

మందాక్రాంత॥ ఏతత్త్వజ్ఞానిధి ఘనులతో నింపు జాలజ్ఞుఁడట్టుల్
స్త్రీతిం గ్రీడించెడిని దనచేఁ బెంపఁగాఁ బద్ధమూతోఁ
నీతిన్ జూచుం బరు గురువుఁ గానీ మగాఁదన్నుఁ జెప్పన్
"భ్రాతల్ మాతల్ సఖులిలని సదా భ్రాంతుడుం బోలెనుండున్. 17

దేవకి—దేవా! తమ ప్రేమాతిశయమిట్లనిపించును.

సీ॥ జడుఁడీతఁడనుచును జడిముడిపడిచాలఁ జాలకన గామదిం జూచినాఁడె
కుటిలుఁడీతఁడటంచు మటమటలాడుచుం గ్రూరభావంబునఁ గోపపడెనె
ద్రోహకరుండంచు దూరంబున నెయుంచి చెంతకు రాకుండఁ జేసినాఁడె
శ్రీశాంగుఁడితఁడన్న చెడుతలంపున నేని నెడదలోనన సహ్యపడినవాఁడె

నూతులగాంధర్వరీతిజ్ఞతలు గాంచి డంబుగా ఘనకంచుకంబు లూనఁగి
యఖిలజనులు సుఖీభవయనుచుఁ బొగడ। దాన పాండిత్యమహిమలఁ దనరె నపుడు
నిజయశఃపుంజమయశంఖనికషణాంచ। దంబరాంబరుఁడైన పీతాంబరుండు.125.

వ. ఇట్లు సకలవైభవంబులఁ గల్యాణ మవధరించి హరిసుఖంబున్న సమయంబున 126.

క. ఇంక ఘనరూపవితతులు। కొంక సరోజాకరములు కుంభిని నదులున్
డ్రొంకఁ బయోనిధు లెంతయు। జంక నిదాఘంబు వచ్చె సరభసవృత్తిన్.127.

సీ. హరియైన వడదాఁకి యట్టిట్టుగాఁడె తా శీల నంబుధిఁ బవ్వళింపఁ డేని
శివుఁడైన దూపిలి చిక్కుఁడె జాహ్నవి నెలమితో శిరసావహింపఁడేని
ధాతయైనను బెట్టు దగచేత నొగలఁడె తమ్మిలో నిమ్ముగా దాఁగఁడేని
యింద్రుఁడైనను జాల నెదరయెండ చెదరఁడే కోడెమబ్బుల నెక్కియాడఁడేని
యనఁగ వేసవియుండెఁ జండాంశుకిరణ । దళదిలాచక్రరేఖాశతప్రసక్త
రక్తసిక్తాంత ధీక్షుద్రిక్తగత్న।భోగనిర్యాతపాతాళభోగి యగుచు. 128

చ. వనరుచు దప్పి నొప్పఁజెడి వాత నొకింతయు మాటలేమి చే
ననిలుఁ డనంగ నొప్పె వ్యజనాంతనిశాంతనితాంతవాసియై
జనఘనఘర్మనిర్మలతుషారకణంబులు గ్రోలి గాలితా
ననయముఁ బొందె గంధవహుఁ డన్నసమాఖ్య మదిన్ముదించుటన్. 129

వ. అప్పుడు. 130

సీ. ఘనములై రుచిఘనఘనములై శుకపికావనములౌ నుద్యానవనములందు
తరములై పరిమళోత్తరములై యానందకరములౌ నంబుజాకరములందు
వలములై మణులతావలములై గ్రహలతాంచలములౌ కేళికాచలములందు
ఘనములై మదనబోధనములై యతివినూతనములౌ మణినికేతనములందు
నగ్గలపుసిగ్గు లడఁగంగ ననఁగి పెనఁగి। గొనబుజంటలు దేరంగఁ గూడియాడి
మద్రజకు నొయ్యఁదనమేను మరపిశౌరి। యలరువిలుకాని క్రీడల నలరుచుండె 131

మ. మురజిద్భక్తిగిరీంద్రనిర్మథితసంపూర్ణాత్మ మేధాసుధా
సరిదీశోదితభాష్యకల్పజయశఃక్షౌమాంబరాళీనిరం

తరగుప్తావిరతోత్తరీయఘనముద్రద్రావిడీనగ్నితా
తురపాంచాలసుతావనప్రవణ గోధుక్సార్వభౌమోపమా. 132

గద్య. ఇది శ్రీమద్రామానుజ భాగినేయకుల సార్వభౌమశ్రీమన్నల్లనా
చార్యవర్య పరిచర్యాధుర్యచన్నకేశవార్యపుత్రతిరుమలాచార్య
పౌత్రగౌతమగోత్రసింహాద్రి వేంకటనామధే
యప్రణీతంబైన లక్షణావివాహంబను
చమత్కారమంజరికిఁ
గోరకాయితం బ
గుతృతీయాశ్వా
సము.

సంపూర్ణము.



ఆ॥ వారలేగి యాచకవృత్తవర్తనుఁగొని । మదిఁదలఁకి రాత్రి నిదురగాచి
సేద్రఁ ధైర్యఁగట్టి పెనచి శీలాంబికా । విత్రసౌఖ్యమునకుఁ జేదుకొనిరి. 151

కం॥ చేదుకొని చిన్నకొమరుల । నాదుకొని శిరాజ్ఞఁ జేతియందునఁ దా
పాదాదులు నింపి యథాస్థితిగా పంచిరి దాని సాధుగాములు పెలుచన్ 152

కం॥ శీలాంబ చిన్నికొమరులఁ । బాలింపుచు నతరు లెఱఁగకతికిం జెప్పన్
బోలుచుగని దోలికనిడి । హేలాగతి నాయఁడున్న యోవనిచే నెసన్ 153

తే॥ ఇచట నాయకులు ముక్త్యాశనాజ్ఞ । భటులచేఁ బేట యడవిఁ గట్టించి విపిన
శిఖిలలో నుంచి దహియించు చిత్తశుద్ధి । బొంది నిద్రించె నా రాత్రి మందిరమున 154

కం॥ అప్పుడు ప్రభవ్యనాయుఁడు । వచ్చిన యాన్యపరివారవరులంగని "యీ
నప్పులప్రబలము నీసన । యప్పినఁ టొలకేలతప్ప నహీ భయ"మనుచున్ 155

కం॥ పచ్చలపల్లకికలో । నచ్చెలుతనుమారకుఁ బ్రియంబున నిడి లో
హెచ్చినవరుసన్ దృష్టిన్ । డచ్చంగరిబాలపురికి దృఢధైర్యమునన్ 156

వ॥ ఇట్లు నగరంబుఁ జేరవచ్చి బంధుమిత్రకళత్రాదులతోడ నిష్టాన్నంబులు భుజియించి
సాయంకాలంబున 157

కం॥ వలసిన సుహృజ్జనంబులఁ । బిలిపించి సమస్తబంధుబృందంబులు దన్
గొలువంగఁ గొలువు దీర్చినఁ । గలయంగనుఁగొని నితాంతకారుణ్యమునన్ 158

ఆ॥ బంధుమిత్రులార! బలవద్విరోధంబు । వలదు నేయ సెట్టివారికైన
బాలురను వధింపఁ బంపెనీభూపాలుఁ । డింక నెవని బ్రదుకనిచ్చునెట్లు 159

కం॥ అరగడియలోన బాలుర । నరిమురిసమయింపఁ జూచె నవనీశ్వరుఁ డ
క్రూరమాలినట్టి కిరివని । మతిఁగొలుచుటపంటెంగీడు మనలకుఁగలదే! 160

ఆ॥ పాము చేరియున్న భవనాంతరంబునఁ । గాపురంబు సేయఁ గానియట్లు
క్రూరుఁ డేలువీటఁ గొనకొనివసియింపఁ । గాదు ధరను సెట్టివారికైన 161

కం॥ కుజనస్నేహముకన్నను । సుజనవిరోధంబు మేలు శుద్ధాత్ముల కే
నిజమాడితింక మీమీ । ప్రజలాలోచించిచూచి పలుకఁగవలయున్ 162

తే॥ బాలమర్త్యులను భూమిపాలసుతులఁ । జేరిసచివుండ్రైన కొల్వుసేయువాఁడ
నర్ధరాజ్యంబునకుఁ బట్టమమరఁగట్టి । పురమమర్చెద వారు కాఁపురము సేయ 163

ఉ॥ అచ్చుగనిశ్చయించితిఁ బ్రయాణముఁ జేసెద రేపె నాయొడన్
మచ్చికగల్గినట్టిదృఢమానసులెవ్వరలైన సమ్మతిన్
వచ్చెదమన్నఁ దోడ్కొనిచనంగలవాఁడ నతిక్రమించి మే
మిచ్చట నేవసించెద మధీశునిచెంగటనన్నవారిఁ బో
నిచ్చెదఁ బోయివచ్చెద నిదేశలవన్నఁ దదాజ్ఞ నందఱున్ 164

ఉ॥ అచ్చపుభక్తిమ్రొక్కి వినయంబునఁ జేతులుమోడ్చి దేవ! మీ
మచ్చికఁ బాసి మే మితరమానవునొక్కనిగొల్వనేర్తుమే?
వచ్చెద మిట్లు మీచరణవారిజముల్ మదినుంచుమమ్ముఁ గా
ర్చిచ్చుఁ జొరంగఁ బంపు మెడసేయక చొచ్చెద మాలకింపుమా 165

తే॥ నిన్నుఁ బాసియున్ననిముస మొక్కయుగంబు । నీవులేనివీడు నెఱయఁ బాడు
నీవునిలువ నిల్లు నిండారిశోభిల్లు । నిన్నుఁ గొల్వవలదె మున్నఫలము 166

వ॥ అనినిశ్చయించి 167

కం॥ సామజవరదుఁడు నాయుం,డే మనకునిజంబటంచు నేకోనశత
గ్రామములవారు తమతమ,ధామంబులువిడిచి వీర ధైర్యంబులతోన్ 168

వ॥ ఇట్లు ప్రయాణోన్ముఖులై యారాత్రి మందిరంబులంగలసకలపదార్థంబు సమర్థించి
కొని మఱునాఁడు ప్రాతఃకాలంబున. 169

సీ॥ వరశతాంగంబులఁ వాజిచయంబుల వాహోరులను బలీవర్ధములను
ఘనతరోష్ట్రంబులఁ గంఖాణతతులను జలవళ్లకావళ్లఁ దలముడియల
క్షారామ్లలవణసంచారభాండంబులుఁ గలధౌతసౌవర్ణ కాంస్యకాచ
శృంగారకూటప్రసిద్ధపైత్తళికాది భాజనంబులు పాకపాత్రికలును
శాలితండులముద్గ మాషతిలమసూర । తువరకోద్రవచణక గోధూమతైల

ఘృతపయోదధిగుడముఖ్య వితతవస్తు । భారములుపూన్చి వెలసతోఁబైనమైరి. 170

సీ॥ దర్భాసనాంతరస్థగితత్రయీధర్మ తత్వశాస్త్రార్థ పుస్తకచయములు
చాపబాణకృపాణ చర్మకుంతప్రాస తోమరముద్గర స్తోమములును
బ్రస్తరాంచితతులా ప్రస్థమానద్రోణ చర్మకుంభాదిక సంచయములు
దాత్రితోత్రేషా ఖనిత్రికోద్దాల లాంగలఖాదపుంగవ గ్రాసతతులు
బ్రాహ్మణక్షత్రవైశ్య శూద్రప్రధాన । కులజు లేకోనశతపురంబులజనములు
తలఁప డెబ్బదిరెండుగోత్రములవారు । తమ కులోచిత వస్తుభారములుపూని. 171

కం॥ నాయునిని దేశమాత్మలఁ । బాయక సమ్యక్ప్రయాణపద్ధతి సంతో
షాయతమానసముల వ । ల్లేయని నడిచి రొకపెండిలికి నేగుగతిన్, 172

సీ॥ వేణుపృష్టాది నిర్మాణపాత్రంబులు శూర్పంబు లాలయశోధనికలు
గొడుగులు కంబళుల్ గోమహిష్యాదులు బాలెంతలును బసిబాలికలును
రోకండ్లు రోళ్లు సుల్లాక ఉల్లభములు పీటలు పేటికల్ పీఠములును
ఘటశరావకదార్వికలును ఖడ్గంబులు జలకుండికలు వల్కలచయంబు
లరదములఁబెట్టి సౌరభేయములఁగట్టి । తోలిరొకకొంద ఱనుముల దున్నలనుహ
నూయిగుంపుల నలవార్చి మహితవస్తు. వితతి గోనియలనుబట్టి వెడలిరపుడు. 173

వ॥ ఇట్లుచని యెడనెడ బాలవృద్ధజనంబుల దిగఁబడకుండ నడిపించికొనుచుఁ బాషాణకంటకాదు లన్వేషింపుచు “మార్గాయాసంబునం దూపటిలిన డింభకాదుల కరణ్యంబున శరణ్యంబు నాయుఁడే” యని పానీయంబులు వెదకుచు జలప్రవాహతీరంబుల నాకొన్న పిన్న పాపలకుఁ జల్దియన్నంబులిడుచు వృక్షచ్ఛాయలం బవళింపుచుఁ దోరంపు టేరంబులందూరి సారంబగుపూరి తురగగోమహిష్యాదులకందిచ్చుచుం జనిచని. 174

ఉ॥ అంబరమధ్యభాగమున “నర్కుఁడు పావకనేత్రనాటః గా
నంబడెఁ దీక్ష్ణాతపమున న్మన” కంచు నెఱుంగఁ దెల్ప చం
దంబున నాయుఁ డయ్యెడ జనంబులనందఱడించి దివ్యతో
యంబులనొప్పియున్న విమలాపగఁజూచి ముదం బెలర్పఁగన్ 175

సీ॥ శ్రీగిరినాథ పాదాగతాతల మరుద్వాహినీకల్ప పావనతరంగ

తీరభూతల సమాధిస్థితోత్తమ జటాధరనిత్యకృత్య పూతప్రవాహ
ఘనఫణాధర నిమ్నగాదర్పనోద్దీప్త వర్ధితతరళ తీవ్రప్రచార
కలికల్మషానంత గాఢాంధకార విన్యస్తనిర్వాత దీపాంకురంబు
గతనిరాతంక సతతసంగత వృషాంక, ధౌతభవపంక శుభగరుత్మద్విటంక
శిశిరతోయాంత ధవళనిర్జితమృగాంక, సంహృతకళంక మల్లెలచంద్రవంక. 176

కం॥ ఈచంద్రవంక జలముల, శ్రీచంద్రకిరీటుఁడున్న శిఖరిశిఖర మీ
లోచనముల కానందద, మై చెలువొందెడి నిదె జూడుఁ డందఱు వేడ్కన్. 177

మ॥ అని నాయుండు మహాజనంబులకు నేత్రానందముల్గాఁగఁ ద
ద్ఘనధాత్రీధరకూట మజ్జలములం గాన్పింప సంతోష భా
జనులై సద్విజకోటిముఖ్యగమనీషావంతు లానాయునిం
గని "విశ్వంభరమూర్తివై నీవిచట వేడ్కం బ్రోలుఁ గావింపుమీ. 178

తే॥ పాలమూచాపురంబు మీప్రోలుమున్న, పూని తత్ప్రతినిధియైనపురము సేయు
చంద్రభాగాసమీపరసాస్థలమునఁ, జెన్నరాయుండు మనలరక్షించుచుండ," 179

మ॥ అనివిప్రోత్తములాడుపల్కులకు బ్రహ్మానాయుఁ డచ్చో మహా
జనముల్ దాను నసించి కంటకమహీజంబుల్ వెసంగూల్చి చ
య్యనఁ బాషాణతతుల్ పగుల్చుపని సేయంబంచె భృత్యాళి న
వ్వనిశోధించి నిమేషమాత్రమున దుర్వారప్రయత్నంబునన్. 180

కం॥ ఆదొరదెల్పినపనిభటు, లాదరమునఁ దృణలతాదు లడఁగఁగ నాద
ర్శోదర మేదురముగ ధర, చీదరఁ దొలఁగించి రేకచిత్తంబులతోన్. 181

ఆ॥ పటకుటీరములును బందిళ్ళు తెరపాక, లాకుచప్పరములు నమరఁగట్టి
విధుదివాకరాది వీథులుగల్పించి, వలసడించిరపుడు వలయునెడల. 182

వ॥ తత్సమయంబున. 183

కం॥ ఆసూర్యసోమవీథుల, లో సాటింపంగఁ బంచె లోకమెఱుఁగ నా
నాసవనిభుఁడగునాయుం, డోసరిలక తమ్మటముల నురువాద్యములన్. 184

తే॥ "ఓ నగరజనులార! యీరాజవీథులందుఁ । జెన్నరాయండు మనకుఁ బ్రసన్నదృష్టిఁ
గనఁ బ్రవర్షంబుఁ గురియుచుం గానఁబోరు । తమతమనివాసములఁ బట్టభవముఁ గొనుఁడు.

కం॥ తూర్ణముగ రాజవీథు । ల్వర్ణంబులు రాశిపోసి వసుధేశుల కీ
నిర్ణయముఁ దెలుపవలయును । బూర్ణముగా" ననుచు సాటిపోయిరి సుభటుల్. 186

కం॥ సాటించిన విని జనములు, పాటింపఁగవలయు ననుచుఁ బరితోషమునన్
గోటులవలె భుజియించిరి, నాఁటని శార్ఙ్గమున బ్రహ్మనాయుని కరుణన్, 187

కం॥ మొగసాలు సుఖములు మెఱుపులు, నిగమగు పెనుగాడ్పు లేక హిమధామరుచుల్
సెగఁజేగఁ గనకాసారం, బగణితమై కుప్పలైన జనులందఱు చూడన్. 188

కం, సురలు బ్రహ్మనాయని, సరసంబుగ కలిగి కుటీయము సంతానమునో
హరిపుష్పవృష్టి యానఁగా, గుటిసెం గాంచరను జనులకో రెండగీలన్. 189

ఆ॥ ధరణి నిండఁ బద్ధతపనీయనిష్కముల్, గలయఁ బోసి సెలిమి గాదియులను
ఘటులు రాజవీథి ఘనర్మజాలంబెల్ల, రాశిఁ జేసి నగర ధరాతలమున. 190

కం॥ ఆయర్థ మగస్త్య బ్రహ్మ, నాయుఁడు సభికులకు జూచి "వరసఖు నవసిం
హాయంబు గాఁగ మందిర, మాయతిఁ గల్పింపవలయు" నని వేగమునన్. 191

తే॥ ధరణివిభులకు దివ్యసౌధములు దీర్చి, "పసఁ పడి సమస్తజనములు! భవనయత్న
ములకుఁ బాల్పడవలయు నీ ముఖ్యవార్త, లాదరింపుఁ" డటన్న నామోదమెసఁగ 192

సీ॥ ప్రాకారములు ముఖ్యభద్రమంటపములు ద్వారబంధంబులు తోరణములు
గర్భగేహంబులు కలితాంతరాళికల్ కుట్టిమంబులు బృహద్గోపురములు
వలభులు వేదికల్ వాతాయనంబులు తల్పులు తోరణస్తంభసమితి
ధ్వజములు బహుద్వారతతులు విశాలసోపానంబులును సాలభంజికలును
నవ మలాందోళికా ఛత్రచామరములు, వరగరుత్మన్మయూరాదివాహనములు
శేషశయనీయ మంగాభిషేకతీర్థ, పాత్రికలు హేమరత్నకల్పనల నెసఁగ. 193

కం॥ రచియించి విమలమరకత, నిచయంబులఁ జారుహాటకనీలాదిమణి
ప్రచలితతోరణపంక్తుల, రుచి దిసలం గప్పఁ జిత్రరూపం బెసఁగన్. 194

తే॥ పాంచరాత్రాగమోక్తసంబంధవేద, మంత్రములతోడఁ బంచాహ్నతంత్రవిధుల
నలిపినాయఁడు చెన్నకేశవుని సుప్ర, తిష్ఠఁజేయించె సర్వఋత్విజులు మెచ్చ.

మ॥ సరసంభావ్యంగ సర్వయాజ్ఞికుల నిష్టాపూర్తిఁ బూజించి భూ
సురసంతర్పణలాచరించి పరమేశున్ వేడ్క సేవించి య
ధ్వరసంహారుని వీరభద్రుని నితాంతప్రీతిఁ దత్సన్నిధిన్
గరమొప్పారఁ బ్రతిష్ఠఁజేసె శుభలగ్నంబెంచి శైవక్రియన్. 196

కం॥ తదనంతరంబ భూపతి, సదనంబులు మున్నుగాఁగ జనములు హర్షం
బొదవఁగఁగట్టిరి పురమ, భ్యుదయంబును బొందఁగా యథోచితసరణిన్. 197

సీ॥ రత్నసౌధంబులు రాజమార్గంబులు తపనీయకుడ్యసంతానములును
మరకతస్తంభముల్ మాణిక్యజాలముల్ హరినీలరచితముక్తాఫలములు
వజ్రకుట్టిమబహిర్ద్వారదేశంబులు విద్రుమచిత్రితవేదికలును
వైడూర్యనిర్మితవలభిపరంపరల్ గోమేధికస్వర్ణగోపురములు
రుచిరశశికాంతమండితాగారములును, హాటకాంచితచిత్రకవాటములును
గలిగివిలసిల్లె బహుశిల్పకౌశలమున శ్రీపురంధ్రీ ముకురము మాచెర్లపురము. 198

కం॥ పురమునఁగన కాసారము, గుడిసెన కాలమున వేడికొని యింటింటన్
దొరికినధనమునఁ గన్నము, పరితోషమెలర్పఁగఁ గట్టెఁ భవనము వెలుచన్. 199

తే॥ రమణ మాచెర్ల సవిధ ధరాతలమున, లాకతమ్యతి వెలయఁగోట్టాల మెట్ట
నూనికట్టిన కన్నమనీని పేరు, ధామ మెన్నంగ నరిది ప్రోలేమి చెప్ప? 200

కం॥ ఈసగిది బ్రహ్మనాయుం, డాపురమునఁ దాను దక్షరాధిపసూనున్
గాఁపురము సేయు నదియుల, కాపురమై యొప్పె నెల్లకాలము సిరులన్. 201

తే॥ బాలమల్దేవులను జనపాలనుతుల, కర్ధరాజ్యంబు విభజించి యుక్తరీతి
సచివుఁడై బ్రహ్మనాయుఁ డిచ్ఛావిహార, లీల ధాత్రీతలంబుఁ బాలింపుచుండె

కం॥ కోదండుకొడుకులను గొని, యాడఁగ శీలాంబ పరమహర్షము మదిఁ దూ
గాడఁగ "సిరులను ధర నా, జో జేసతు"లనుచునుండె శుద్ధాంతమునన్. 203

సీ॥ లావణ్యపాథోధిలలితవీచి లవాంబ యైశ్వర్యమణిపేటి యైతవోటి
గౌరీపదాంభోజసౌరభాళిప్రియభావచిత్పేటి గౌరివధూటి
పరమపతివ్రతాపారసద్గుణసుధాజలధివేలా కామ తులసీనామ
కరుణారసాపూర్ణకలితమూర్తనవచక్రిమధామ మాచాంబికాలలామ
"పంచకన్యల మగుడనిర్మించె నజుఁ"డ । నంగ నేగాంద్రుఁడు నత్తఁజేరంగవచ్చి
చరణకమలంబులకు మ్రొక్కి కరయుగములు। మోడ్చి యిట్లనిపల్కె రామోద మెడలి

కం॥ అత్తరో! నీసుతులు కృపా । యత్తులు నాచేయుసేవ లామోదమునన్
మెత్తురు సకలసుఖంబుల । కిత్తఱిలోపంబులేదు దక్షిణగుణాఢ్యా 205

కం॥ సంతానము సురధేనువు । సంతానము సతులకెల్ల సంతానంబా
సంతానహీనలకు మా । సంతాపమునూన్ప నీవ చాలుదువమ్మా 206

కం॥ వర్ణింప "నపుత్రస్య గ । తిర్నాస్తి" యనంగ మీకుఁదెలియదే? మీరా
కర్ణింపనిశాస్త్రార్థవి । విన్నయములుగలవె? చెప్ప నేర్తుమె మీకున్? 207

ఉ॥ "నందనహీనమైన భవనంబు వనం"బని నీతిశాస్త్రవి
ద్బృందము చెప్ప మానసము లెల్లఁదలంకెడు మున్ను వీర లే
చందమునం దనూజుల విచక్షణులం గని పెంచినారొ? మ
మ్మిందఱ నట్లచేయుమనుమమ్ము దయాగుణశీల! శీలమా! 208

తే॥ అనినఁగోడండ్రమాటల కాత్మనలరి । తడవు యోచించి పుత్రసంతానమునకుఁ
గారణంబగుకార్యంబుగలదె వేఱె? చెన్నునకుఁదక్క నిత్యప్రపన్నలార! 209

కం॥ గజిబిజిపడ నేటికి మన। గజనిమ్మవనమ్ములోన గజగామినులా!
గజరాజవరదు హరి న।గజజనకుంగొల్వ ఫలముగలుగదె? మీకున్ 210

ఆ॥ ఎండియున్న భూజ మిగురించెనేని మీ। యందుఁ జెన్నరాయఁ డొందియుండుఁ
బల్లవింపకున్న ఫలములేదని మనో। దృఢము చేసికొనుఁడు తెఱవలార! 211

మ॥ అని శీలాంబిక యానతిచ్చినఁ బయోజాస్యల్ వెసం బోయి త
ద్వనవీథిం గజనిమ్మభూరుహము చెంతం గోముఖంబొప్పఁ దీ

ర్చినభూమిన్ వసియించి చేటికలచే శృంగారము ప్పారఁ బా
వనతోయంబులు దేరఁ బంచి రచితావాలంబునం బోయుచున్ 212

కం॥ మునమ్మారు నెన్నరాయని । సన్నుతిఁ బూజించి ఫలరసాయన పక్వా
న్నమ్ములు నైవేద్యంబిడి । కొమ్ములు తమకోర్కెలెల్లఁ గొనసాఁగుటకై 213

తే॥ దైత్యమర్దనువజ్జనోదకము లెత్తి । తెచ్చి సౌవర్ణపాత్రల నిచ్చి దన్మ
హీరుహాలవాలమునఁ బోయ నిగురువొడమె । నీరజాక్షునికరుణ సాధారణంబె? 214

సీ॥ అరుణోదయంబున నంగనల్ జలమాడి సలిలకాషాయవస్త్రములుగట్టి
హరిద్రాచూర్ణంబుల మరఁ బూసి నవ్యలలాటంబులను కుంకుమలు ధరించి
గంధసారాంగరు కాశ్మీర మృగమదానూన లేపంబులు మేనఁ బూసి
శబ్దగ్రహాంతవిశాల నేత్రంబులఁ బోలుపొందఁ గజ్జలముఁ గదించి
ఫుల్లకల్హారకరవీరమల్లికాతి । ముక్తచంపకకేతకీముఖ్యపుష్ప
రాజమధురసపనసనారంగకదళి । కాదిఫలములఁ గొని సతుల్ మోదమలర 215

కం॥ గుడిఁ జొచ్చి చెన్నరాయని । యడుగుల కనమస్కరించి యాగమవిధిచే
నుతపులు తప్ప సద్విజు । లెదసెదమంత్రములు సెప్ప నేకాగ్రమతిన్ 216

సీ॥ "ధ్యానంబు బహిరంతరానంతరూపున కావాహనము సర్వభావునకును
బాద్యంబు పదనఖాపాదితాపగునకు నభిషేక మబ్ధిశయ్యాతలునకు
గంధార్పణము గంధగజరాజగమనునకుఁ బుష్పముల్ పుష్పాస్త్రపోషకునకు
ధూపంబు దావాగ్నిధూమగంధునకును దీపంబు సుజ్ఞానదీపకునకు
ఫలచయోపాయనము సర్వఫలదునకు" । నంచుఁ బూజించు భక్తిఁ బ్రణమ్మించు జోంస్తు
"వాసుదేవాయ శ్రీరమావల్లభాయ । వనజనేత్రాయ తేనమో" యనుచు మ్రొక్కు

కం॥ ప్రాసాదపుష్పములకై । దోసిళ్ళొగ్గంగ నైతతోయ్యాలికి సము
ల్లాసమెసర్పఁగ దోయిట । వాసంతీప్రసవసమితి వడి పడిఁ బడియెన్ 218

కం॥ దోయిటఁ బడిన సుమంబుల । నాయునిసతి యైత తోడి నారీమణులన్
బాయక యందఱకిచ్చె న । హాయొంలవిడనాడఁ దరమె? యబలలకైనన్ 219

చం॥ తోడరి ప్రదోషమందుఁ బనిదుర్మతిఁ బూనరు గుందరాత్మమి
త్రుఁ డుసిరి చెందినన్ గురుని రోఘులుగా రహిఁ భీతిఁ జెందరె
న్నఁడుఁ గల్లనైన సాగసవనస్ఫుటసంపదమాయఁ జూచరే
ర్పడనకలం కవృత్తిఁ బురి రాజిలు రాజులు రాజమాత్రులే? 53

చం॥ గరువము మేనదొట్ట నలకాపురిఁ గాఁపురముల్ వసింపుచున్
వరుసని ధానముల్ నవతవాటిలఁ దానొకమూలఁ జేరెఁ బెం
పరధనదుం డనన్ వినిదయాళువులై యతఁ దండకీర్తిచే
నిరవుకొనంగ సంచితములిత్తురు సారెఁ బురీకిరాటకుల్ 54

ఉ॥ ముమ్మరమైన ధాన్యములు ముద్రలు వేయఁ జెందు జాళువా
దుమ్ములఁ బంకమైన తనతోయములందగు పైడితమ్ములం
దమ్ములు గాంచి గంగ మదిఁ దాఁ జెలఁగందగి రందుఁ బాదజాల్
తమ్ములు గల్గి గారవిలు ధన్యుల సంపద కేటిలెక్కనన్ 55

ఉ॥ బింకపు గబ్బిగుబ్బెతల బిత్తరి చూపులు మేని తావులున్
గొంకక కాంచి లీల మెలగున్ దులయానిలు డబ్ధినిన్ నిరా
తంకమరం దసారణుల దాఁటుచుఁ దన్నొగనీటి చన్నయా
జింకపడా వుమావి చటఁ జిక్కఁడు గాయని చూచుకైవడిన్. 56

ఉ॥ ధూపితకంకణావలులతో నలనూనమహోర్మికాంత లీ
లాపటలంబుతో సమవలంబిత పుష్కరవిభ్రమంబుతోఁ
గ్రుపవహించుఁ గోకనదకాంతులు చెంతలఁ గొంతరింపఁగా
నాపుటభేదనంపుఁ గమలాకరముల్ గమలాకరాకృతిన్. 57

మ॥ బిసముల్ బాహులు మాకరందరసముల్ బింబాధరంబుల్ వల
ద్ఘసలంబుల్ గురు లంచపత్రములు నేత్రంబుల్ శ్రితాస్తోకకో
కసమాజంబులు గుబ్బచన్నులుగ వేడ్కన్ బద్మినుల్ పద్మినీ
విసరంబయ్యెనొ? నూత్నసృష్టిన నదీవిన్నింతు రింతుల్ పురిన్. 58

సీ॥ పురుషోత్తమఖ్యాతిఁ బొరయని పురుషుండు శ్రీకాంతపై ఖరిఁ జెందని సతి

కుంభినీశస్థలిఁ గోరని గజములు హరిసమాఖ్యనెసంగనట్టి హయము
పీతాంబరస్ఫూర్తిఁ బెరయని మేడయుఁ జక్రభృత్పటిమ గాంచని కొలంకు
మధుసూదనవిభూతిమయని తీవయు మాధవాలంకృతి మనని తరువు
వెదకినన్ లేక యీవీఁక "విష్ణుమయము సర్వ"మనుమాటఁ దెల్పుచు సకలవస్తు
సంచయముల వికుంఠతఁ గాంచు కతనఁ బరఁగె నప్పుడు వైకుంఠపురమనంగా 59

మ॥ ఘనచాతుర్యము మీఱ నీగతి సమగ్రశ్రీలఁ దేలన్ సృజిం
చిన యాశోభనరాజధాని కలుముల్ సేనాని శ్రీజానికిన్
వినతుండై తగ విన్నవింప మఱియు న్విశ్వోద్ధారకల్యాణకాం
తుఁ డతిప్రీతమనస్కుఁడై నిఖిలలేఖవ్రాతముల్ గొల్వఁగాన్. 60

చ॥ కరిగిరికల్ తటిల్లతలఁ గప్పులఁ జెంచు బదారువన్నెబం
గరుగరులార్పుచున్ వలనుగా సముఖంబుననున్న వాజిశే
ఖరు గరుడున్ ముదంబునను గంతముఁ దట్టుచు నెక్కి చుట్టువా
ల్గారదొరసాని దాను నతితూర్ణగతిన్ వియదగ్రపద్ధతిన్. 61

శా॥ ఈరీతిన్ గమకింపుచో సురనదీహేమాంబుపూర్ణుల్ భుజం
గారాతిచ్ఛదజాత వాతహతిచే నంతంతఁ బైఁగప్పఁ బి
చ్చారుత్వంబున భర్మచేలులగుచున్ సారూప్యభూతిన్ విఱు
చ్చారు ల్గయికొని కొల్వఁ జక్రి చనెఁ దేజఃపేటి కవ్వీటికిన్. 62

మ॥ చని చెంతన్ దెలినీటితమ్మికిఁ బరిష్కారంబుగా గణ్యకా
భినవశ్రీనిడు హేమవప్రపటలిన్ బెంపొందుచున్మించు నా
ఘనవైకుంఠపురంబుఁ జేరి తదసంఖ్యాతార్ణశృంగారముల్
గనుగొంచు న్మగసాలఁ జొచ్చి శుభలీలన్ రాజమార్గంబునన్ 63

కం. అకలంకనైభవంబున । మకరాంకగురుండు రాగ మత్తాళికదం
బకవేణుల్ బిసపాణుల్ । శకటాంగశ్రోణు లగు నచటిపూబోణుల్. 64

కం॥ తనుగొనఁ దివురు నభీష్టము । కనుఁగొనలం దివురులొత్తఁగా నెక్కి రొగిన్
గనక నగోపమితములై । కనకనమను సౌధవీథికలకున్ గడకన్. 65

మ॥ తన నెమ్మోమున బొట్టిడం గొనిన యాదర్శంబుతో నబ్జలో
చన యెత్తించె నొకర్తు శ్రీపతిగనన్ స్వామీ! ముఖశ్రీలనె
ల్లను నిచ్చల్ హరియింపఁజొచ్చె నడియాలంబుల్ విమర్శింపు గ్రొ
క్కున నద్దం బిదుగో వికాసమునఁ గన్గొమ్మన్న చందంబునన్. 66

ఉ॥ రవగంధియొర్తు నవకంబగు తామరసంబు కేలశృం
గారవినోదశీలఁ దగఁ గంజదళాక్షునిఁ జూడ వచ్చెనో
నీరదవర్ణ యిప్పుడొక నీరజపాణి వరించితే నను న్
నీరజపాణిఁ గాని కరుణింపుము నన్ను నటన్న కైవడిన్ 67

మ॥ లవితాంఘ్రిచ్ఛవి మోవికెంజిగి ముఖోల్లాసద్యుతుల్ గాంచి గో
వెలఁదుల్ చిల్కలు దుమ్మెదల్ పదువులై వెన్నంట రా వచ్చె నా
జలజాక్షుం గన నొక్కయుం గన మనస్సంజాతుఁ డుపంగఁ త
ద్బలసంఘంబును బారఁజూపు కరణిన్ భద్రేభకుంభస్థలిన్. 68

మ॥ అమితోత్సాహత నిట్లు శౌరిఁ గని మోహావిర్భవత్సారవ
శ్యమునన్ గొందఱు సుందరీమణులు చేష్టల్ దక్కఁ దచ్చారు నే
త్రము లీషన్ముకుళత్వమున్ బొరసి నా దైత్యారి దృక్చంద్రసూ
ర్యమరీచుల్ ప్రసరించు పెంపుగని తా రజ్జాత్మకోటం బలెన్. 69

మ॥ అలివేణుల్ త్వర నీగతిన్ గనకహర్మ్యప్రాంగణాగ్రోహలై
యలరు ల్లాజలు కుంకుమాక్షతము లుద్యల్లీలఁ బైఁ జల్లుచున్
గళ లీనం గపురంపుటారతులు ముక్తారాజి నీరాజనం
బులు దీనింపుచు నిచ్చి రచ్యుతునకున్ బుణ్యాంగనల్ పాడఁగన్. 70

శా॥ గాంగేయాంగ పతంగపుంగవ తురంగత్సంగ దుత్తుంగ భా
రంగత్పత్రవిచిత్రచామరసమీరప్రస్తఘర్మాంబుఁ డా
శృంగారాంగజమూర్తి తద్విభవముల్ శ్రీమించఁ గన్గొంచు సా
రంగాంకద్యుతిదీప్తమానగరు జారంబోయి మోదంబునన్. 71

కం॥ ఖగరాజస్కంధము డిగి । నగరాజ త్సౌధమండనంబులఁ దగు నా
నగరీజనమున్ సుమనో । నగరాజిరుచిరము గడచి నాతియుఁ దానున్ 72

చం॥ అమితసువర్ణదర్పణము లంబుజరాగవితానముల్ సురేం
ద్రమణికపోతపాలికలు రాజితమౌక్తికతోరణంబు లొ
ప్పు మిగులు మధ్యరంగమునఁ బుత్తడిబొమ్మలనాట్యకేళిచేఁ
గొమరగు కొల్వుకూటమునకున్ జని కంజదళాక్షుఁ డత్తఱిన్ 73

ద్విపదగర్భితసీసము.

మందారకహ్లార మహిమచే నెగడి చందనతరువాటి చందంబు దెగడి
తొగరుకుప్పార సాంద్రవిభూతిఁ గాంచి సౌరాపగావీచి సౌరాక్రమించి
శారదాంబుద కంబు సంపద నేలి వారిదములచల్వ వారింపఁ జాలి
పర్వేందుచంద్రికాపటిమఁ జెన్నొంది సర్వజ్ఞు మైచాయ సర్వంబు నొంది
చారుశోభార్త్రికచ్ఛట మీరుమీర, హరిసింహాసనం బలరారఁ గాంచి
వెన్నుఁ డందు వసించె వేల్పులసురలు, సన్నుతింపంగ నిశ్చలసమ్మితమున 74

గీ॥ అలరుజలరుహాసనాదు లత్తఱిఁ జెంత । వరుస నురుసముత్సవములఁ బూని
నిలువుగొలువు సేయ నేర్పుతో నపు డహి । శయను నయనసంజ్ఞ సైన్యవిభుఁడు 75

చం॥ గురుమృగనాభి సంకుమద కుంకుమ పంకము కట్టువర్గముల్
పరిమళవీటికల్ కనకపాత్రములం దిడి తెచ్చి యిచ్చి యో
సురవరులార శ్రీవరుని శోభనముల్ గన మళ్లి రావలెన్
హరిహయుఁ దాచిగా నిజగృహంబుల కేగుఁడటంచుఁ బల్కెనన్ 76

కం॥ కరుణారసపూర పయో । వరుణాలయ! చక్రి! పోయివచ్చెద మనుచున్
శరణాగతమతి శ్రీపతి । చరణాంబుజములకు సురలు సాగిలి మ్రొక్కన్ 77

సీ॥ లేవనెత్తుచుఁ గౌఁగలించె మహేంద్రుని హస్తముఁ జూచి లెమ్మనుచుఁ గిలి
నలసితంచు యథోచితాలాపముల యముఁ బోయిరమ్మని పల్కె పుణ్యజనుని
సంస్మితాననబింబసంజ్ఞచే వరుణుని సుముఖభావమునఁ గేల్ జూపి పవను
సముచితాలాపవీక్షణముల ధనదుని భ్రూవిలాసంబున భూతపతిని
నుల్లమలరంగఁ బంపుచు నెల్లవారిఁ । దగిన తెఱఁగుల వీడ్కొల్పి దనుజవైరి
వేత్రధరహుంకృతులు మీరి వేడ్కమీరి । శ్రీకరాభ్యంతరాగారసీమఁ జేరె. 78

బందరు గొడుగుపేట వసించెడి "రాయవరపు బూర్గయ్య" యను నతఁడు 1889 వ సంవత్సరపు నవంబరు 1 వ తేదిని "సేలంజిల్లాయప్పీలుతీర్పని" యొకపుస్తకముం బ్రకటించె అందు "రామలింగాచారి" యనునొకకంసాలిని గొందఱు చతుర్థులు మాలవానిచేఁగొట్టించి యవమానపఱుపఁగా నతఁడు స్వకులస్థులచే బహిష్కృతుఁడై ప్రాయశ్చిత్తశుద్ధుఁడు కావలసివచ్చినట్లును నందుకుఁగాను బండీతసదరమీన్ కోర్టులో దావా వేసినట్లును సదరుకోర్టువారు "మద్యమాంససేవకుఁడగు హీనజాతివారికి ప్రాయశ్చిత్తమేమి? ఖర్చులిప్పించు టేమి?" యని వానినలాపకృష్టతం దలుపుధర్మశాస్త్రములు దాహరించుచు నీదావాకొట్టివేసినట్లును నందు పైవాదిప్రయత్నముచేఁ బునర్విచారణ నిమిత్తము రిమాండుచేయఁబడినట్లును దత్పునర్విచారణచేసిన హిందూసదరమీన్ కోర్టువారు "కులవిషయములోఁ బండీత సదరమీన్ గారికిభిన్నాభిప్రాయములు కా"వనుచు "నెట్టికులమైనను దోషులక్షులచే వెలివేయఁబడి తత్ప్రకారము ప్రాయశ్చిత్తకలాపము జరుపఁబడనిది కులములోనికిరానీయఁబడకుండెఁ గావున నాఖర్చులకుగాను ... పాయ లిప్పించుచున్నా"మని తీర్పువిధించినట్లును నటుపైఁ గూడఁదనివిసనక జిల్లాకోర్టులోన పీలుచేయఁబడినట్లును నున్నయది. ఆయప్పీలర్జీలోఁ గంసాలశబ్దమునకు "జగమునేలువాఁ" డనియు "సృజియించువాఁ" డనియునర్థము చెప్పుకొని తచ్ఛబ్దవాచ్యులు తామగుటకంగీకరించియేయున్నారు. సామాన్యముగానిట్టి యర్థముఁ జెప్పుకొనిననంత విశ్వాసార్హము కాకనియోగమేమో! యిస్థలమునమనవారు గొప్పసాహసకృత్యమొనరించిరి. అదేదియన నామలింగానుశాసనములోని ప్రథమకాండమందలి "గౌతమశ్చార్కబంధుశ్చ మాయాదేవీసుతశ్చసః" అనువాక్యమునకును "బ్రహ్మాత్మభూస్సురజ్యేష్ఠః పరమేష్ఠి పితామహః" అనువాక్యమునకును మధ్య "విశ్వకర్మపదానంతో పంచాస్యో మేరునిర్మితః పంచబ్రహ్మాదిరూపస్స్యాత్ ముక్తికాంబరవాహనః మిత్రావరుణచిద్వేషో ...పాలో జగద్గురుః శంభుసాక్షీ పంచవేదీశభాస్యస్సుఖోర్ధ్వవాహమనుర్మయశ్చత్వష్టాచశిల్పీవిశ్వజ్ఞమూర్తయః కంసాలో శ్రీహరేతస్మాద్బ్రాహ్మణో హరికేతనః అనుభాగము దబ్బిపెట్టిరి అందుయథార్థమేటులున్నను విశ్వకర్మశబ్దము మొదలు పంచవేదిశబ్దపర్యంతము విశ్వకర్మకే శ్లేషలెను మనుమయాదులు తన్ముఖోద్భవులవలెను గనుపడుచున్నయది. చివరభాగమున "అందువలననో శ్రీహరీ! కంసాలుఁడన బ్రాహ్మణుఁ" డని యొకఁడో విష్ణువుం గూర్చి చెప్పుచున్న ట్లభిప్రాయమనుచున్నది. ఇదినిఘంటువుగాని పురాణము కాదు. ఇట్టిదానిలో విష్ణువును గూర్చి కంసాల బ్రాహ్మణ్యమేల రెండులకుఁ జెప్పవలసివచ్చెనో గోచరముకాకున్నయది. ఇంకనొకగనాగరవింపములేయైనప్పు డనకతనకగా నుండెడి

యవ్విశ్వకర్మాదిశబ్దములవ్యుత్పత్తివిచారమునకేల? ఈశ్లోకములు నావఱకింగాను శాసనములో నేదేశపుబ్రతిలోఁగాని యేభాషాప్రతిలోఁగాని చూచినవారు మందునకైనఁగానరారైరి. పోనిండు వారిపైఁగలద్వేషముతో మనవారీభాగము నుత్పన్నముచేసిరనియేయందము. ఆద్వేషము సమస్తదేశములవారికింగలుగుటే మహాశ్చర్యకరముగా నున్నది. ఇంతమందికి ద్వేషభాజనులగు వీరికులౌత్కృష్ట్యమేమనివర్ణింపనగు. కానివీరు సల్పినసాహసమే సహస్రముఖముల శ్లాఘింపనగును. పరమేశ్వరుఁడొక్క పాండిత్యాతిశయమే వీరికులమునకుఁ బెట్టలేదుకాని యదికూడఁ బెట్టినచో వేదములను క్రిందుచేసి తమయిచ్చవచ్చినట్లు శాస్త్రములనే మార్చుచుండిరి. శ్లో॥ గజేకడంగరీ యేతుజారేరాజనివాపునః। పాపస్యశ్చనవిద్వాంస్సని యంతాజంతుగ్రతః॥ ఏనుఁగు పైరులు మేసినను రాజుజారుఁడైనను విద్వాంసులు పాపమునకుఁ దలఁపడినను నెవరుశిక్షింతురు.

చం॥ అలముకొనంగఁ జేసెలిపి యుంగలికి గ్రహులాశ్రమానముల్
గలకలియందుచుఁదుష్టుఁడుఁ గంసలవానికి బ్రాహ్మణత్వముల్
నిలుపఁగనెంచినావు సరినిల్పవనిల్పుదుగాక పాండితీ
కలితులఁగూడఁ జేసెదముఁ గాల్పక ప్రోవనె యోపరాత్పరా!

పైయప్పీలర్జీలోనే తమకులములోని దరిద్రులు ధనికులు గురువులు మొదలైనసమస్తజనులును వేదోక్త ప్రకారమొక్కయాచారినామమే పెట్టుకొందురనియు సంకరమాలలైన బ్రాహ్మణులయ్యవారు భట్లు అయ్యంగారు రాయుఁడు దీక్షితులు జోశ్యులు ఆచార్యులు మొదలగు ననేక పౌరుషేయనామములఁ గ్రహింతురనియు నిందించుచుఁ దామాచారి శబ్దవాచ్యులగుటకు వేదప్రమాణము శిల్పిశాస్త్రము 3వ అధ్యాయము 4వ ప్రకరణము దేవతానిర్మాణ సమయములోనిదని శ్లో॥ ఆకార ఆగమాభ్యాసీ చాకారశ్శాస్త్రకోవిదః। రీకారో దేవతోత్పత్తి రాచారీత్యక్షరత్రయం॥ అనుదాని నుదహరించిరి, ఆహా! యిదియే కాఁబోలు వేదము శిల్పిశాస్త్రము మన వేదాభిన్నముగా? ఏమీ! యీశబ్దము స్ఫుటతయు నీయన్వయగాంభీర్యమును ఆకారమున నాగమాభ్యాసియఁట. చాకారమునకు శాస్త్రకోవిదుఁడఁట! యర్థము. మూలములోనే చాకారముండునపుడు చాత్రమేయనక మరలనర్థములో, శాస్త్రమని వ్రాయుటయెందులకో? ఈప్రమాణములఁ జూచియే కాఁబోలు మ॥ నాళ్లచెర్వురామారావుగారు రఘుశాలప్రహసనములోఁదజచు చాత్రమనియే ప్రయోగింపఁజొచ్చిరి. సరియాకారమున నాగమాభ్యాసియుఁ జాకారమునకుఁ జాత్రకోవిదుఁడు నర్థమగుఁగాక, రీకారమునకు దేవతోత్పత్తి యెట్లులో తెలియరాకున్నదే!

# వై. హనుమంతరావు,

## ఆర్టిస్టిక్ ఫొటోగ్రాఫరు అండు బ్రోమైడు యన్లార్జరు,

## నర్సారావుపేట.

మాచే తయారుచేయబడు ఫొటోగ్రాపులు మిగుల పనితనముగలిగి చూచుట కందముగాను శాశ్వతముగాను యుండును

ఫొటోగ్రాపులనుబట్టి అత్యంతసూక్ష్మముగాగాని మిగులపెద్దవిగా బ్రోమైడు యన్లార్జిమెంటుగాని బహునేర్పుతోను చిత్రమైన పనులతోనున్ను తయారుచేయబడును. పాతఫొటోగ్రాపులనుపట్టి క్రొత్తవిగాచేసి యివ్వబడును. ఒకపటములో పదిమందిమనుష్యుల మధ్యకూర్చున్న మనిషిని ప్రత్యేకముగా ఫొటొగ్రాపులుపట్టియివ్వబడును. ఒకపటములోనే ఒకమనిషియే యిద్దరుగా వుండునట్లు ఫొటొగ్రాపుపట్టబడును.

| ఫొటోసైజులు. | ధరలు. | | | |
|---|---|---|---|---|
| | 1-వ కాపీ2-కి | అరడజను | డజను | ప్రతిమొక్కువ |
| కార్డుసైజు నిండువిగ్రహము | 1-8-0 | 2-8-0 | 4-8-0 | 0-6-0 |
| బస్టు లేక గ్రూఫ్ | 2-0-0 | 3-0-0 | 5-0-0 | 0-8-0 |
| క్యాబినెట్ సైజునిండువిగ్రహము | 3-0-0 | 5-0-0 | 9-0-0 | 0-12-0 |
| బస్టు లేక గ్రూఫ్ | 4-0-0 | 6-0-0 | 10-0-0 | 1-0-0 |
| ఫుల్ సైజు నిండు విగ్రహము | 6-0-0 | 9-0-0 | 12-0-0 | 1-0-0 |
| బస్టు లేక గ్రూఫ్ | 8-0-0 | 11-0-0 | 18-0-0 | 1-8-0 |

## బ్రోమైడ్ యన్లార్జిమెంటు.

10 × 12 రు 12-0-0, 15 + 12 రు 20-0-0, 23 × 17 రు 30-0-0, 30 × 24 రు 40-0-0

☞ షరా:—12 కాపీలకుపైగా తీయువారికి మొదటికాపీచార్జి వదలివేయబడును. పాత ఫొటోగ్రాపులను బట్టి క్రొత్తవిగా తయారు చేయువాటికి పటములను చూచిధరలు యేర్పాటు చేయబడును. ఇతరవిషయములను గురించి స్వయముగా మాట్లాడుకొనవచ్చును. నెగటెవును చూపమనిగాని యివ్వమనిగాని కోరకూడదు. ఇతర గ్రామములకు రమ్మని కోరువారు ఖర్చులు తామే భరించుకొనవలెను.

B. V. Press, Narasarowpet.

## ఈనెలసొమ్ము చెల్లించినచందాదార్లు

1 తాటికొండ రామకృష్ణారావుగారు, షరాబు, నర్సారావుపేట.
2 నడింపల్లి లక్ష్మినారాయణగారు, ఫారెస్టు రేంజికర్ర్కు-కోసూరు.
3 సి, విఠలరావుగారు, వకీలు, హైదరాబాద.
4 జి. నారాయణరావుగారు' వకీలు, హైదరాబాదు.
5 సింగం సిద్ధరామశాస్త్రిగారు, విలేజిమునసబ్' మల్లయపాలెం.
6 రాళ్లభండిరామచంద్రయ్యగారు, గణపవరం.
7 ఆకెళ్ల, శేషశాస్త్రిగారు, కుంకలగుంట.
8 గోపాలుని వెంకటసుబ్బారావుగారు, కరణంముప్పాళ్ల
9 అన్నంరాజుసుబ్బారావుగారు, నందూరు.
10 వుంగుటూరిజానికిరామయ్యగారు' గోవిందపురం
11 నిమ్మరాజు, వెంకట్రామయ్యగారు, యనమదల.
12 ఏకాంబరంపురావుగారు, గొట్టిపాడు.
13 కనుపర్తిలక్ష్మినారాయణగారు, కరణం, కనుపర్తి

### " మానవసేవ ,,

ఇయ్యది అనునదినాల్గు పుటలుగలిగి చిత్రపటశోభితమై విలసిల్లుచు 2, 3, సంచికలు మాకార్యస్థానమలంకరించినవి. పత్రికా సంపాదకులు కందుల శ్రీమన్నారాయణ నామము కృష్ణారావుగార్లు. ఇందు మత, సంఘు, పరిశ్రమ, భాషావిషయములు చర్చింపఁబడును.

చందా—సంవత్సరమునకు రు 3 లు అభిమానులకు రు 5 లు పోషకులకు రు 10 లు, వలయువారు యడిటర్ 'మానవసేవ, రాజమహేంద్రవరము అనివ్రాయవలెను. దీనిని గురించి విశేషించి ముందుసంచికలో వ్రాయబడును.

## SQUAREROOT TABELES.
### వర్గమూలముటేబిలు.

ఇచ్చిన్నిపాత్రము గణితంబున కరణములకు, రివిన్యూయిన స్పెక్టరులకు, ల్యాండు రికార్డు రివిన్యూయిన స్పెక్టర్లకు ప్రకృతసర్వేపనుల కుపయుక్తముగునటుల, పొలముపై దిరుగునపుడు జేబునందిమిడ్చుకొని పని చేయుటకు వీలుగముద్రించినారము. వెల రు0-6-0

వలయువారలు:— విన్నకోట వెంకటరత్నయ్య,
భారతీవిలాస ముద్రాక్షరశాల, నర్సరావుపేట. అనివ్రాసి తెప్పించుకొనవచ్చును.

## ప్రధాన పోషకులు.

1 శ్రీశ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు

## పోషకులు.

1 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు, మక్తాదార్, చోల్లేరు.
2 పులిపాక పూర్ణయ్యపంతులుగారు, వకీల్, నర్సరావుపేట.
3 రంగావఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు, గుంటూరు.
4 తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల.
5 రామసింగుగారు, నెల్లూరు.
6 పోలేపల్లి రాజేశ్వరరావు, దేశముఖుగారు, పెద్దపల్లి.
7 దేవరాజు మురళీధరరావుగారు, ఫ్రాదెల.

అభినవసరస్వతి కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | |
|---|---|---|
| 1 | అళ్వయాచార్యవిజయము. | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూరెపీరభద్రకవి) | 0-4-0 |
| 3 | వాసంతికాపరిణయము. (డ్రామా) | 0-4-0 |
| 4 | కంసవధము. (ఇది 7 అంకములనాటకము) | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి. (సింహాద్రి వెంకటాచార్యులు) | 0-4-6 |
| 6 | విరూపాక్ష పీఠ గురుపరంపర. | 0-2-0 |
| 7 | నీతిగీతలు. | 0-2-0 |

వలయువారలు సొమ్ముపంపిగాని వీ-పీద్వారాగాని యీక్రింది వారికివ్రాసి తెప్పించుకొనవచ్చును.

 జానపాటి పురుషోత్తం,
సబ్ యెడిటర్, జానపాడు.
పిడుగురాళ్ళపోస్టు, గుంటూరుజిల్లా.

## GEMS FROM BHAGAVAD GITA

### భగవద్గీతారత్నములు

శంకరభాష్యార్థసహితముగ నింగ్లీషర్థముఁజేర్చి మృదుమధుర శైలితో ముద్దులుమూటగట్టునట్లు 125 పేజీలతో మంచిబయిండు చేయఁబడినది. వెల 0-2-0

 వలయువారు మాకువ్రాసుకొనవలయును
తాటికొండరామకృష్ణారావు, నర్సరావుపేట